# బాల వ్యాకరణం

## సంధి పరిచ్ఛేదం

## ఉత్వ,అత్వ, యడాగమ సంధులు

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# అచ్ సంధులు...

- ఉత్వ సంధి
- యడాగమ సంధి
- అత్వ సంధి
- ఇత్వ సంధి
- ఆమ్రేడిత సంధి
- ద్విరుక్త టకార సంధి
- అచ్ సంధి - ప్రవృత్తి

# ఉత్వ సంధి

1. ఉత్తున కచ్చు పరం బగునప్పుడు సంధి యగు.

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.

- ✓ రాముఁడు + అతడు = రాముఁ డతడు (రాముడ్-ఉ+అ-తడు )
- ✓ సోముఁడు + ఇతఁడు = సోముఁ డితడు
- ✓ మనము + ఉంటిమి = = మన ముంటిమి
- ✓ అతఁడు+ ఎక్కడ= అతఁ డెక్కడ
- ✓ ఇతఁడు + ఒకఁడు = ఇతఁ డొకఁడు

# ఉత్వ సంధి వైకల్పికం

2. ప్రథమేతర విభక్తి,శత్రర్థచువర్ణంబులం దున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును.

- ✓ నన్నున్ + అడిగె : న న్నడిగె,నన్ను నడిగె.
- ✓ నాకొఱకున్ + ఇచ్చె : నాకొఱకిచ్చె, నాకొఱకు నిచ్చె.
- ✓ నాకున్ + ఆదరువు : నా కాదరువు, నాకు నాదరువు.
- ✓ నాయందున్ + ఆశ : నాయం దాశ, నాయందు నాశ.

# ఉదాహరణలుమరి కొన్ని

నాయందున్ + ఆశ : నాయం దాశ, నాయందు నాశ.
ఇందున్ + ఉన్నాఁడు : ఇం దున్నాఁడు, ఇందు నున్నాఁడు.
ఎందున్ + ఉంటివి : ఎందుంటివి, ఎందు నుంటివి.
వచ్చుచున్ + ఉండెను : వచ్చు చుండెను, వచ్చుచు నుండెను.
చూచుచున్ + ఏఁగెను : చూచు చేఁగెను, చూచుచు నేఁగెను.

# యడాగమ సంధి

3. సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు.

ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు. (అచః స్వరాః)

- ✓ మా + అమ్మ : మాయమ్మ.
- ✓ మా + ఇల్లు : మాయిల్లు.
- ✓ మా + ఊరు : మాయూరు.

# అత్వ సంధి

4. అత్తునకు సంధి బహుళముగా నగు.

- ✓ మేన + అల్లుడు =మేనల్లుఁడు, మేనయల్లుఁడు.
- ✓ పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు.
- ✓ చూడక + ఉండెను = చూడ కుండెను, చూడక యుండెను.

---

సీతమ్మ, వెలయాలు, మేనల్లుడు/మేనయల్లుడు, ఒకానొక

# అత్వ సంధి

- బహుళగ్రహణముచేత స్త్రీవాచక, తత్సమ, సంబోధనాంతములకు సంధి లేదు.

✓ అమ్మ + ఇచ్చెను = అమ్మ యిచ్చెను
✓ దూత + ఇతఁడు = దూత యితఁడు
✓ చెలువుఁడ + ఇందము = చెలువుఁడయిందము.

# అత్వ సంధి

- సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిఁ బూర్వకావ్యములందుఁ బ్రయోగంబు మృగ్యంబు.
- ఆధునిక కృతులం దొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడు.
  - ✓ గంగనుకాసె, నెలఁ తిచ్చెను.
- వెలయాల్వాదుల సంధి లేమి బాహుళకము చేతనే యని యూహించునది.

## ఉత్వ సంధి

* రాముడతడు, సోముడితడు
* నన్నడిగె / నన్నునడిగె

## యడాగమ సంధి

* మాయమ్మ, మాయిల్లు, మాయూరు

## అత్వ సంధి

* సీతమ్మ, వెలయాలు
* మేనల్లుడు/ మేనయల్లుడు, వెలయాలు

